# ఆదిత్య హృదయం

(పద్య, వచన కవితా సంకలనం)

సంకలనం:

**గబ్బిట దుర్గాప్రసాద్**

ప్రచురణ:

**సరసభారతి**

ఉయ్యూరు

**Aditya Hrudayam**

(Collection of poems)

may **2012**

Copies: 500

(C) **Publishers**

Price. **Free of Cost**

Cover Design: **Kala Sagar**
Dtp& Page making: **Ramya bharati**

For Copies:-

**Gabbita Durga Prasad**
**President, Sarasa Bharathi**
**Literary& Cultural Organization**
**VUYYURU- 521 165 Krishna dist**

Printed at: **Sri sri printers** vja-2

# స్నేహ నందనం

ఏటాలాగానే సరసభారతి తన 35వ సమావేశంగా శ్రీనందన నామ సంవత్సర ఉగాది కవిసమ్మేళనం, పద్యకవి సమ్మేళనంను "ఆదిత్య హృదయం" పైన, వచన కవి సమ్మేళనాన్ని "స్నేహం" మీద 18-03-2012 ఆదివారం సాయంత్రం ఉయ్యూరులో శాఖాగ్రంథాలయంలో సాయంత్రం నాలుగు గంటలకు నిర్ణయించింది. అత్యధిక సంఖ్యలో సాహితీ ప్రియులు పాల్గొన్న ఈ కార్యక్రమంలో స్వర్గీయ గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రిగార్ల స్మారక ఉగాది పురస్కారాలను శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్, శ్రీ చలపాక ప్రకాష్, శ్రీ యర్రప్రగడ రామకృష్ణ, శ్రీమతి వారణాసి సూర్యకుమారి, శ్రీ విష్ణుబొట్ల సుబ్రహ్మణ్యేశ్వర (కన్నయ్య) ఘనాపాటి, శ్రీ టి.వి.సత్యన్నారాయణలకు గబ్బిట దుర్గా ప్రసాద్ ప్రభావతి దంపతులు వారందరినీ దుశ్శాలువాలతో ఘనంగా సత్కరించి జ్ఞాపికలను అందజేశారు. శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ రచించిన "దర్శనీయ దేవాలయాలు" మరియు "జనవేమన" పుస్తకాలను శాసనమండలి సభ్యులు శ్రీ యలమంచిలి వెంకట బాబూ రాజేంద్ర ప్రసాద్, శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్‌గార్లు ఆవిష్కరించారు. దీంతో సరసభారతి ప్రచురణలు 7 సంఖ్యకు చేరాయి. సభకు శ్రీమతి జోశ్యుల శ్యామలాదేవి అధ్యక్షత వహించగా, శ్రీ గబ్బిట దుర్గా ప్రసాద్ సభా సంచాలనం చేశారు. గురజాడ అప్పారావుగారిపై స్థానిక పాఠశాల విద్యార్థులకు శ్రీ అమరవాణి హైస్కూల్లో ప్రిన్సిపాల్ శ్రీ పి.వి.నాగరాజు ఆధ్వర్యంలో జరిగిన వ్యాస రచన, వక్తృత్వ పోటీలలో గెలు పొందినవారికి శ్రీమతి కోపూరి పుష్పాదేవిగారు సొంత ఖర్చులతో బహుమతులను ప్రదానం చేశారు. సన్మానితులు ఆనందంగా తమ స్పందనను తెలియజేశారు. డా॥ రావిరంగారావు, లయన్స్ క్లబ్ అధ్యక్షులు శ్రీ నూకల వెంకట సాంబశివరావు, ప్రముఖ రేడియో ఆర్టిస్టు ఎ.బి.ఆనంద్‌గార్లు ఆత్మీయ అతిథులుగా పాల్గొని తమ అమూల్య సందేశాలను అందించారు. విజయవాడ ఆకాశవాణి కేంద్ర సంచాలకులు శ్రీ ఆదిత్య ప్రసాద్‌గారు, సంగీత సాహిత్య సమ్మేళనంగా సోదాహరణ ప్రసంగం చేసి సభ్యులను తమ గాన మాధుర్యంతో అలరించి బహుదా ప్రశంసలను అందుకొన్నారు.

అనంతరం డా॥ గుమ్మా సాంబశివరావుగారు "ఆదిత్య హృదయం" అనే విషయంపై పద్య కవితా సమ్మేళనం నిర్వహించారు. శ్రీ ఆదిత్య ప్రసాద్‌గారు రేడియో సంచాలకులుగా పదవీ బాధ్యతలను స్వీకరించిన దగ్గర నుండి తెలుగు భాషకు సాహిత్యానికి, సంస్కృతికి, సంగీత, నాటక, పద్య, పాటల భజన, హరికథా, రాజకీయ, శాస్త్ర, సాంకేతిక, రైతు కార్మిక కార్యక్రమాలలో తమ ముద్రను వేసి ఆకాశవాణిని ప్రజల దగ్గరకు ఏ విధంగా తీసుకు వెళ్ళారో కవులు తమ కవితలలో



గొప్పగా ఆవిష్కరించారు. ప్రసాద్‌గారు స్వయంగా చేస్తున్న సంగీత సాధన, వాయులీన ప్రయోగాలు, తెలుగు పాట పుట్టుక వ్యాప్తిల విషయంలో వచ్చిన క్రమ పరిణామంలను ఎలా జనం ముందుకు తీసుకువచ్చారో, ఎంతటి పరిశీలన, పరిశోధనా, నిత్యం చేస్తున్నారో, రేడియోను జనసామాన్యంలోకి ఎలా తీసుకుని రాగలిగారో వారు పద్యాలలో అద్భుతంగా ఆవిష్కరించారు. ఇందులో సర్వశ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి, శ్రీ పింగళి వెంకట కృష్ణారావు, శ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, గుడిసేవ విష్ణు ప్రసాద్, మల్లాప్రగడ శ్రీమన్నారాయణ, రామడుగు వెంకటేశ్వర శర్మ పాల్గొని తమ మధురమైన పద్యాలతో, అమోఘ స్వరంతో అలరించారు. వీరందరికీ శాలువా, జ్ఞాపికలు అందజేసి సన్మానించారు.

తరువాత "స్నేహం" అనే అంశంతో వచన కవిసమ్మేళనాన్ని శ్రీ అరసవిల్లి కృష్ణ నిర్వహించారు. స్నేహంలో ఉన్న మాధుర్యం, స్నేహం విలువ, స్నేహం మనుషుల్ని ఎంత దగ్గరకు తీసుకుని వస్తుందో, స్నేహవారధి వల్ల కలిగే ప్రయోజనాలను కవులు తమ కవితా కౌశలంతో ఆవిష్కరించారు. సర్వశ్రీ కోసూరి రవికుమార్, వేలూరి కౌండిన్య, పాణిగ్రాహి రాజశేఖర్, వసుధ బసవేశ్వరరావు, శ్రీమతి జి. మేరీకృపాబాయి, శ్రీమతి కోపూరి పుష్పాదేవి, శ్రీమతి వడ్డాది సుభద్ర తమ కవితా గానంతో స్నేహ సుగంధాన్ని పంచారు. అందరు పరవశించి విన్నారు. గొప్ప అనుభూతికి శ్రోతలు లోనై ఆనందం అనుభవించారు. పద్య, వచన కవి సమ్మేళనాలు రెండు రంజింప జేశాయి. కార్యదర్శి శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి పర్యవేక్షించి వందన సమర్పణ చేశారు.

స్నేహం అంటే మిత్రత్వం. మిత్రుడు అంటే సూర్యుడే. సూర్యుడునే ఆదిత్యుడు అంటాం. అందుకని ఇక్కడ ఆదిత్య హృదయం అంటే- స్నేహ హృదయమేనని అందరు భావించారు. కనుక ఆయనలోని స్నేహధర్మం, మనలోని స్నేహధర్మం, అందరి మధ్య ఉన్న మమతానుబంధం ఆవిష్కరింపబడిన రోజుగా గుర్తిండిపోతుంది ఈ నందన నామవత్సర కవిసమ్మేళనం. అందుకే దీన్ని "స్నేహనందనం" అన్నాను.

మిత్రుడు, యువకుడు, స్నేహశీలి, పత్రికా సంపాదకుడు శ్రీ చలపాక ప్రకాష్‌ను ఈ కవిసమ్మేళన కవితలను పుస్తకరూపంలో తెచ్చే బాధ్యతను సభాముఖంగా కోరగా, క్షణం ఆలోచించకుండా ఒప్పుకున్నారు. బాధ్యత అంటే పారిపోయే రోజుల్లో బాధ్యత నెత్తిమీద వేసుకొని సాంఘిక బాధ్యతగా, ఆప్తజన హితైషిగా ప్రకాష్ చేస్తున్న ఈ కార్యక్రమంకు సరసభారతి ఆయనకు కృతజ్ఞతలు అందిస్తోంది. అందంగా రసరమ్యంగా ఈ పుస్తకం రూపుదాల్చడానికి ప్రకాష్ తీసుకొన్న శ్రద్ధ, ఆసక్తి మరువలేనిది. రమ్యభారతి సరసభారతితో కలసి నడుస్తుండటం శుభావహమైన విషయం. "రమ్య సరస భారతి"కి స్వాగతం పలుకుదాం.

**– గబ్బిట దుర్గాప్రసాద్, అధ్యక్షులు, సరసభారతి**

## కవితాంశం:

# ఆదిత్య హృదయం



# విషయ సూచిక

**1.కవితాంశం: ఆదిత్య హృదయం**

1. వసంత ప్రసాదం.... పువ్వాడ తిక్కన సోమయాజి......................7
2. ఆదిత్య హృదయం .....రావి రంగారావు .............................9
3. ఆదిత్యాయ నమః ..... పాలపర్తి శ్యామలానందప్రసాద్.............11
4. అభినందనలు.......... పింగళి వేంకట కృష్ణారావు ...................13
5. సంగీత జ్ఞానేశ్వరుడు .... గుమ్మా సాంబశివరావు .....................17
6.అభినందన నందనము ...మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి.........19
7. ఆదిత్య హృదయం ......డా॥ రామడుగు వెంకటేశ్వరశర్మ..............22
8. ఆదిత్య దర్శనం ........ డా॥ వి.నాగరాజ్యలక్ష్మి.......................25

**2.కవితాంశం: స్నేహం**

9. నా నిశ్శబ్దంలో నీ పిలుపు ....... అమూల్య తెర్లి .......................28
10. అక్షర కుక్షి .....................వేలూరి కౌండిన్య ......................29
11. స్నేహం ........................పాణిగ్రాహి రాజశేఖర్ ................30
12. దిరిసెన పువ్వు ................కోసూరి రవికుమార్ ..................32
13. స్నేహం ...................... వసుధ ................................33
14. స్నేహవనం .................... కోపూరి పుష్పాదేవి ..................35
15.స్నేహ పరిమళం ................జి.మేరీకృపాభాయి ...................37
16. నీ స్నేహం .....................శర్మ సి.హెచ్ ........................39
17. స్నేహం ........................గంధం వేంకాస్వామీశం .............40
18.అజరామరము స్నేహం ..........తేజస్విని ............................42
19. స్నేహవారధి నిర్మిద్దాం .......... గబ్బిట దుర్గాప్రసాద్ ..............44
20.స్నేహం .........................వడ్డాది లక్ష్మీసుభద్ర ..................46
21. చెరో సగం ............................అరసవిల్లి కృష్ణ ...............47

# వసంత ప్రసాదం

శ్రీరస్తు జనావళికి క
ళారామానంద కందళ న్మహితాత్మ
స్ఫారోదారులకున్, వి
ద్యారాజీవానన యిడ నక్షర రక్షన్!

నందన వత్సరాంగన గనంగ వినంగ 'సుయూరు'నందు నిం
పొందగ విందుసేసెడి ప్రపూతచరిత్రుల కీప్రజాళి, కా
నంద రసాంతరంగ నటనాస్ఫుట నవ్య వసంత రాగ సం
స్పందితయై యిడన్ 'సరస భారతి' సత్కవితాసుధాంజలుల్!

ఆదిత్యుని హృదయమ్మా?
సాధుత్వము, చండ సాంధ్య చరవృత్తముశిల్!
ఆదిత్యప్రసాద్ హృదయమొ?
ఏదిన మొపుదుదయ రేఖ లీను సువృత్తుల్!

ఆకాశవాణిని ఆదిత్యు బాణిగా
తీర్చిదిద్దిన సుధీ దిగ్యశుండు
రేడియో శ్రవణ పారీణతన్ నెక్కొల్పి
అబ్బుర పరచిన ఆంధ్రకీర్తి
పల్లెలెల్ల పలుకుపంటల రాజిల్ల
హృద్యవైద్య మొనర్చు ఋతువిభుండు





స్వకపోల కల్పిత స్వరరాగ లయతాళ
కలకంఠ గళలీల ఘంటసాల

ఎన్ని బిరుదు లెన్నెన్ని సత్కృతుల తతులు
వచ్చి వరియించెనో తమవన్నె బెంప–
తన్మహావ్యక్త పరివేష ధాతువులను
కెంపుదళ్కుల సొంపు లెక్కింప దరమె!

హృద్యమైన తెనుంగు పద్యవాగ్దేవికి
పట్టమ్ము గట్టిన ప్రాభవమును,
ఆలోచనా లోచనామృత రసధార
హృత్కంజముల నింపు సత్కథలును,
కీర్తిశేష విశిష్ట మూర్తిమ ద్వాక్చిత్ర
సంశ్రవణ విధాన సౌహృదమును,
సరస సంభాషణా చాతుర్య ధౌరేయ
శాస్త్ర చర్యా విశేషార్చనములు,

సహృదయ శ్రోతృమండలి స్వాంత మెఱుగు;
"విజయవాడ ఆకాశవాణి జనవాణి"
యనెడి ముద్రగొన్న అధిపు దాదితేయ
దీధితున కస్మ దాశిషో ద్గీర్ణ గీతి!

**–పువ్వాడ తిక్కన సోమయాజి,**
98856 28572.

# ఆదిత్య హృదయం

సంగీత ప్రయోగంబుల
రంగమ్మున రాణకెక్కి రాజిల్లెదు ఓ
మంగళగిరి ఆదిత్యా!
సంగీతము జనహితమ్ము సలిపితి వార్యా!

పేదలోనైప మణి ఉన్న వెంటబడుచు
దాని వెలుపలకుందీసి ధరణినింద
తరణి కాంతులు పంచగా తపము చేయు
నెంతొ, ఆకాశవాణి యోగీంద్రు డీవు!

ఎక్కడో పొగ కనిపింప దిక్కు తెలిసి
వెలయు నిప్పులన్ జ్వాలగా వెలుగజేసి
కాంతి మంజుల దీపాలు గా నొనర్చి
జగతి చీకట్లు పోకార్చు చతుర మతివి!

పాత కొత్తల మిశ్రమ భావలతల
చక్కగా అల్లుకొన జేయు సరసమతివి!
గగన వాణికి సుమధుర గళము నొసగి
భారతీప్రియ పుత్రుడ వైతి వీవు!

లలిత కళలకెల్ల కలనాద కేంద్రమ్ము,
మాతృభాష కీవు మంచి తల్లి,





సరస జనకు డీవు సంస్కృతి ప్రభకెల్ల
నిండు తెలుగుదనము నీదు రూపు.

**-రావి రంగారావు**
20/151-1, మోనికా రెసిడెన్సీ,
కొబ్బరితోట, మచిలీపట్నం- 521 002.

# ఆదిత్యాయ నమ:

1. ఈత్నడె కృష్ణరాయలని ఎల్లరు మెచ్చగ నాంధ్రభోజసం
గీతకళావిశిష్టతకొకేయొకడైన నవకృష్ణదేవరాట్
ఖ్యాతిని గాంచెనంతట మహానటుడై కవి గాయకుండునై
ప్రీతినిమెత్తు మంగళగిరి ప్రముఖాబ్ధి శశాంక సుందరున్

2. అభినవ ఘంటసాలయయి ఆయన పాడిన పాట తియ్యనల్
సభలకెఱుంగ జెప్పరస సంభరితమ్ముగ పాడునట్టిధీ
విభవము నీకె చెల్లెను కవిస్తుత! నిస్తులభావజాల! సా
మభవయశస్కరా! విమలమంగళగిర్యుదయాద్రి భాస్కరా!

3. జ్యోతిష శాస్త్రమందు కడు సూక్ష్మవివేచన కల్గినట్టి ప్ర
జ్ఞాతిశయమ్ము నందిన మహామతివై నమకాది రుద్రముల్
ప్రీతిని వించు షిర్డివిభులీల లెఱింగెడు యోగివైన నీ
రీతులు మానవాళికి వరిష్ఠములయ్యె! నమో నమోస్తుతే.

4. కానగరాని దేవతలుగా కళలెల్ల సమాజదూరమై
జ్ఞానుల యొద్దనే నిలువగా దగదంచు సమక్ష దేవతా
హ్వానపతాకగా గగనవాణిని పండిత పామరప్రియా
స్థానిగ దిద్దితీర్చిన ప్రశస్తికి మెచ్చెద నాదితేయునిన్.

5. ఇంటింట ప్రసాదముగా
కంటికి శ్రమలేని చదువుగా చెవికింపై





మింటిని మంటిని కలిపెడి
వెంటిగ నాకాశవాణి పేనితివి భళీ!

6. పల్లెపల్లెకు బోయి పిల్లపెద్దలగూడి ఆకాశవాణి ప్రఖ్యాతిదెలిపి
రేడియోకంటె మరేడి యోధుడటంచు, ప్రజల కన్నింట తోడ్పడుచు నుండి
సంగీత సాహిత్య జానపదకళాళి, శాస్త్రీయవిజ్ఞాన సంపదనిడి
ఆదిత్యునకు మున్నె నాదస్వరమ్ముతో, సౌఖశాయనిక ప్రశస్తినొంది

గడప గడపకు వేకువ నడుగుపెట్టి
పల్కరించి విజ్ఞానమ్ము చిల్కరింప
విజయవాడ గగనవాణి విలువ నిలుపు
మంగళగిరి కులేందు నమస్కరింతు.

7. నిత్యము రాగతాళ రమణీయ గళమ్మున గీత శాస్త్ర పాం
డిత్యము వాయులీనత గడించిన నూత్న ప్రయోగరీతులున్
స్తుత్యములై లభించె బిరుదుల్ బహమానము లెన్నొచోట్ల నా
దిత్య ప్రసాద వర్య! నినదించెనదించె భవ తృష్ణిన్ దిశల్.

'కాశీకవి' 'శతవధానిశేఖర' 'విద్యా వారిధి'
**పాలపర్తి శ్యామలానంద ప్రసాద్**
సెల్ నెం.9440346287

# అభినందనలు

1. సంగీత సాహిత్య సమలంకృతుడెగాని
సూటు బూటులు లేని నీటుకాడు
పాటకచేరీలు పండిత గోష్ఠులె
గాని జల్పములకు పోనివాడు
ఉద్యోగ విధులందు నుద్యమించునె గాని
విశ్రాంతి కోరని వినుత శీలి
పదవులు బిరుదులు వరియించి ననుగాని
అతిశయం బెరగని అనఘుడితడు
పలువురకుమేలుసేయగ పదవియనెడి
సౌమ్యుడాకాశవాణి సంచాలకుండు
సరసుడైన ఆదిత్యప్రసాదు. ఇతని
చిరయశంబునుగాంచ నాశీర్వదింతు

2. ఎడ్లబండి సవారి నెవ్వాడు చేయించె
గ్రామాల రేడియో ఘనతదెలుప
పద్యంబు ప్రతియింట హృద్యంబుగాజేసి
వినిపించె నెవ్వాడు వీనులలర
మూల మూలలబడి మూల్గుప్రక్రియలకు
దివ్య కాంతినెవడు తెచ్చినాడు
ఇంటింట రేడియో నిల్లాండ్ర పనులందు
నేస్తముగ నెవడు నిలిపినాడు
అతడు నిత్య కృషీవలుడైనవాడు





క్రొత్త సంగీత రూపక రూప శిల్పి
సరసుడెన్నాదిత్యప్రసాద ఘనుడు
మంగళగిరి వంశోర్భవమణియితండు

3. గానమ్మునొకవంక కవనమ్ము నొకవంక
సమముగా ధరియించు సవ్యసాచి
అధికారమొకవంక అణకువ నొకవంక
పొదివి పట్టినయట్టి పుణ్యశాలి
పాండిత్య మొకవంక ప్రకటనమొకవంక
పరిఢవిల్లినయట్టి భాగ్యశాలి
దివ్యత్వమొకవంక నవ్యత్వమొకవంక
పెనవేసుకొనినట్టి మనసువాడు
అతడు సంప్రదాయ కళల కండ దండ
అభ్యుదయమార్గములనెల్ల నాదరించు
సౌమ్యుడట్టి ఆదిత్యప్రసాదు. సుజన
వినుతు డితనికి శ్రేయము లొనరు గాక!
ఉదయించు తరణి మహోజ్వల కాంతి నీ
లో దివ్య భావంబు పాదుకొల్పు
బాలభానుని లేత బంగారు కిరణాలు
తేజమొసగినిన్ను తీర్చునెపుడు
మధ్యాహ్నవిద్యోత మార్తాండ మూర్తి వి
క్రమము నొసగి నిన్ను కాచుచుండు
పరసంధ్య వెలుగొందు పరమాత్మ సూర్యుడు
నీకీర్తి కాంతుల నిలుపుచుండు

వినుతు డాదిత్యుడను పేరు పెట్టుకొనగ
ఆదిదేవుడాసవిత నీయందు కరుణ
చూపు తథ్యంబు సతము లోచూపుగలగి
ఆయురారోగ్య భాగ్యాల నలరుమయ్య.

**–పింగళి వేంకటకృష్ణారావు.**





**ఆ**దిత్యాని కృషి చేతను
ఆహ్లాదముగా వినుజనులత్యంతముగా
భేష్ భేషని పలుకగ
ఆకసవాణిని మిగులగ
పొగడెదమాష్ట్రో!

**–గోళ్ల నారాయణరావు**
విజయవాడ.

# సంగీత జ్ఞానేశ్వరుడు

1. కం॥ **మ**ంగళగిరివంశంబును
నింగికి ఆదిత్యుడవయి నిరతమువెలిగే
సంగీతజ్ఞానేశ్వర!
సింగారపు చరితనీది చెప్పగతరమా!

2. తే॥ వాయు లీనమ్ము వాయించు పథముగనుచు
గాత్ర మాధుర్యమునుజూపు కరణి వినుచు
నీకు సాటిని వెదుకంగ నేమి ఫలము
నీకు నీవె సాటియనుచు మాకు దోచు.

3. ఉ॥ మెత్తని మానసంబునను మేలునుగోరుచుమెల్గువాడు – ఏ
లెత్తిన రాగకోటులవలీలగ పాడుచునుండువాడు –స
ర్వోత్తమ గాయకుండనుచు నుర్విని వెల్గిన ఘంటసాలగా
చిత్తములందు నిల్చు సుమ చిత్తుప్రసాదు ప్రశంసజేసెదన్

4. తే॥ భువన విజయాఖ్య సభలలో భూరిగుణుడు
సాహితీ సమరాంగణ సార్వభౌము
పాత్రధరియించునీతీరు పరమఘనుము
నీవె! రాయలవను భ్రాంతి నిల్చుమదిని

5. సీ॥ ఆరిపోయెడుదీపమట్లుగా ఆకాశ – వాణి తేజము వీడుపగిదిగాంచి
ఆకాశవాణిని ఆకర్ష వాణిగా – దిద్దితీర్చినయట్టి దివ్యచరిత!
ఇంపైన రేడియోన్ ఎడ్లబండికికట్టి – సాగుమనిన్నయట్టి సజ్జనుండ!
వచ్చినవారిని వట్టిగా పంపక – అవకాశమిచ్చెడి ఆత్మబంధు!





ఆ॥ పథకరచనలోన ప్రాభవమ్మును జూపి – కొత్తకొత్త పనులు కోరిచేసి
అగ్రపథములోన నాకాశవాణిని – నిల్పినట్టి ఘనతనీదె చూడ

6. ఆ॥ ఎదిగినట్టివాడు ఒదిగియుండెడు నన్న
పలుకుబడికి నీవె పరమసాక్షి!
ఉన్నతంపు పదవి మిన్నగా నున్నను
గర్వమసలు లేని ఘనుడవీవు

7. మ॥ తెలుగుంబాటల తీరుతెన్నులరయన్ తియ్యంబుగానుండునీ
కల కంఠంబున మ్రోయురీతులు వినంగాశైలశ్రేణీగళ
జ్జల పాతంబుల శబ్దమౌను, జలదస్వానంబు గాదోచు... స
ల్లలితానందగుణాకరా! వెలుగుమా! లక్ష్యంబు గానమ్ముగా

8. కం॥ శ్రీకరములు నీదు పనులు
వాకునకందని బిరుదులు వందల సభలన్
లోకాదిత్యకిరణమా!
నీకు శతాయువగుగాక నిర్మలమూర్తీ!

9. తే॥ నీదు ప్రతిభను మెచ్చుచు నెన్నియైన
కాన్కలొసగంగ వచ్చుచు గాయకేంద్ర!
నవ్య భూషణలిడు శక్తి నాకులేదు
పద్య నవరత్న హారమ్ము పట్టుమయ్య!

**–గుమ్మా సాంబశివరావు**
తెలుగు శాఖాగ్రహి,
ఆంధ్ర లయోల కళాశాల,
విజయవాడ–8,
చరవాణి: 98492 65025.

# అభినందన నందనము

శ్రీ 'మంగళగిరి' వంశము
ధామము మహనీయులకును ధన్యచరిత్రా!
ఏ మని అభినందింతును?
ఆమనియే మీ హృదయము 'ఆదిత్య' బుధా!

పుత్తడికి తావి చలువయు పొదిగినట్లు
మంచి మనసును విద్వత్తు మధుర వాక్కు
కలిపి సృష్టించెనో మిమ్ము కమలజుండు
పలుకు చుందురు సభలెల్ల పులకరింప.

అభినందన చందన మిదె
అభినవ శ్రీకృష్ణరాయ! ఆదిత్యా! మీ
విభవము నిరుపమమై, మిము
శుభములు వరియించు గాక! సురుచిర లీలన్

ఆలకు తీయని పాలును
పూలకు మరి పరిమళములు పొలుపొందునుగా,
తాలిమి ఋషులకు సాజము
మేలొన గూర్చుట పరులకు మీ నైజమ్మో





అరమర లేని కూరిమిని హాయిగ నందర పల్కరించుచున్
గరువమొకింత లేని గుణగణ్యుడు, గాన కళా విలాస సం
భరిత మనస్కుడై వరలు ప్రాజ్ఞుడు, భారత భవ్య సంస్కృతీ
పరిమళ మంతరంగమున పండిన మాన్యుడు, ధన్యుడాతడే

కవియో గాయకుడో రసజ్ఞుడొ కళాకారుండెవండైన చే
రువ నున్నట్లుగ విన్నయంతటనె తా ప్రోత్సాహమందించు, గౌ
రవ పీఠమ్మొసగున్, ప్రియంబలరగా రప్పించు వెన్వెంటనే,
స్తవనీయంబగు తెల్గువెల్గులకు నాధారంబు "ఆదిత్యు"డే

అదియొకనేర్పు, పుట్టువున నబ్బిన పున్నెము, గాన సత్కళా
సదనము మీదు గాత్రమది, చల్లగ మెల్లగ పిల్లతెమ్మెరల్
హృదయము మీటినట్లు మురిపింతురు మైమరపింతు రెల్లరన్,
ముదమున మీగళంబునకు మోడ్చెద చేతులు గానకోకిలా!

సంగీతము, సాహిత్యము
బంగారమువంటి గళము, ప్రవిమల హృదయో
త్తుంగ తరంగము నడవడి,
మంగళగిరి! మీకివియె నమస్సుమనస్సుల్

ఎద కరిగించు మీ మృదుగాన వైఖరీ
వైభవమ్మునకు సౌభాగ్యమస్తు!
ఆకాశవాణికి యశమును గూర్చు మీ
ప్రోత్సాహమునకు నభ్యుదయ మస్తు!

మంచిని పాటించి మమతలు పంచు మీ
రుచిరమౌ నుడుల కారోగ్యమస్తు!
కవిపండితుల పట్ల కడలేక నిల్చు మీ
అభిమానమునకు దీర్ఘాయురస్తు!

స్నేహశీలి! మీకు శ్రీరస్తు! శుభమస్తు!
అభ్యుదయ పరంపరాభివృద్ధి
రస్తు! మంగళగిరి ఆదిత్య! మీకింక
చిర యశోభివృద్ధి సిద్ధిరస్తు!

–'మధురభారతి'
**మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**
301, శ్రీసాయిసౌధ, ఎన్.టి.ఆర్ వీధి,
కృష్ణనగర్, గుంటూరు–522 006.
ఫోన్: 81061 96418.





# ఆదిత్య హృదయం

1. ప్రథితమైనట్టి "ఉయ్యూరు" పట్టణమున ।
"సరసభారతి" ఘనపురస్కారమందఁ
జేయువారికి–పొందు విశిష్టులకును ।
అందరికి మత్కృతజ్ఞతా వందనములు॥

2. నవతన్నలరు ఆనందనందనవనంబు ।
అవనిలో నిత్య "మృత్యుంజయా"త్మకంబు
భవ్యసత్ప్రతిభా "ప్రభావతి"మయంబు ।
"సరసభారతీ" ఘనపురస్కారమౌర॥

3. సంగీత సాహిత్య సత్కళలన్నచో ।
అనయంబు చెవికోసికొనెడివాఁడు
'జవసత్త్వములనిచ్చునవమన్నమయ' అంచు ।
అన్నమయ్యను గూర్చియనెడివాఁడు
పాటనునుతేటగా–పద్యమున్ హృద్యంబు ।
గా –గానమొనరింపఁ గలుగవాఁడు
వర్ధిష్ణు సుకవుల భవితవ్యమును ప్రోత్స
హించు లక్షణమున్న మంచివాఁడు

గగనవాణి కేంద్రాకాశ జగతిలోన ।
ఉత్తరాయ"ణాదిత్యుఁడై"యొప్పువాఁడు
సిరిగుణంబుల "మంగళగిరి"యతండు ।
వందనంబులు – సాహితీ చందనములు॥

4. అందరివాఁడు - అందరికి అందెడివాఁడిల - పల్లెపల్లె సం
స్పందనమొందఁగా 'విజయవాటి'కగా కిరణాలవాణి - వీన్
విందుగఁజేయువెల్గు; కనెపేశి పురస్కృతి; చైత్రజైత్ర మీ
'నందన'; జీవనాన - నవనందనముల్ వికసింపఁ జేయుతన్॥

5. ధరనారోగ్యద దివ్యభవ్యమగు చైతన్యంబునందించు భా
స్కరుఁడేమోపగలింట; నీవొమరి - సాక్షాత్కారమౌ చందువే
కరమాశ్చర్యము రాతిరింబవలిదే! "ఆకాశవాణీప్రభా
కర"యన్ నీ బిరుదోవిశిష్ట విజయాకారంబుగా వర్ధిలన్॥

6. భారతీయపుగాన పరిణామమైన "గీ। తాలాపన ప్రసంగ" ధాటికి -
నతి
అల ప్రయోగ ప్రదర్శనాత్మంబు నీఘంట। సాల గానామృతహేల -
వహ్వా
నీదైన "రాగాలపూదోటలో తెల్గు। పాట - సయ్యాటె -సెబాసు! -
భేషు!
ప్రాచ్యపాశ్చాత్య ప్రభావ విశ్లేషమీ। "త్యాగరాట్ కీర్తనధార" - ఆహ!

'చెలువుమీఋ నీ వయొలిన్ కచేరి హోయి!।
పసి చెదని నీదు జీవన కుసుమమునకు
వీడని పరిమళంబులివ్వియెగదోయి!
కృషిని సలువంగ నీవహో! ఋషి సముఁడవె!।
సాధుగాత్ర! "ఆదిత్యప్రసాద" మిత్ర॥

7. వర "రసాలయ"గ "రేపల్లె"యే "లలిత సం। గీతసాగర" పురస్కృతి





నొసంగె
మేటియౌ "బెజవాడ రోటరీ క్లబ్బె - నిన్। "జీవితసాఫల్య" శిష్టుఁ
జేసె
కామనువెల్తు బ్రాడ్ కాస్టింగు "రోల్సురా। యిసు" పురస్కారంబు
నేయొసంగె
ప్రముఖ గానకళైక పరిషత్తె "సంగీత। జ్ఞానేశ్వర"గ పురస్కార మిడియె
ఒకటె, రెండటే, మూఁడటే ప్రకటముగను। లెక్కలేనన్ని వేపురస్కృతులె
నీకు
ఘనతలసదనుగ్రహ కళాకారుఁ డయ్యు। నామసామ్యమ్ము గనియు
నేనాఁడుగాని
ఇన్నిసత్కృతులందెనే? ఇనుడు - అసలు। క్షితిపురస్కృతికే
పురస్కృతివిగావె॥

8. నిత్యకళాసముద్రగతనిర్మలనీరమునే గ్రహించి, యౌ
చిత్యము మీఱ నా'విరి'గ c జేసి, వియద్గతమేఘ వీధి పాం
డిత్య ప్రశంసలొప్పఁగ కడిందిగ హర్షపు వర్షమిచ్చు "ఆ
దిత్యు"ని సత్"ప్రసాద"పు హృదిన్ మదిమెచ్చినమస్కరించెదన్॥

9. భవ్యసంగీత సాహిత్య పద్మములకు
నిత్యమిటు కాంతినిడెడి "ఆదిత్యు"ని దరి
బిరుదుపద్మాల వేలొకో? వెలయలేదు?
"పద్మభూషణ" "శ్రీ"లతోవరలుగాక!॥

**-డా॥రామడుగు వెంకటేశ్వర శర్మ**
ఇంటి.నెం:5-19-9(ఎ), శ్రీకవితా
సదనం, శ్రీవేంకటేశ్వర బాలకుటీర్ వద్ద,
2/17 బ్రాడీపేట, గుంటూరు-522 002.
ఫోన్: 98669 44287.

# ఆదిత్య దర్శనం

1. శ్రీమంగళగిరి వంశము
ధీమాన్యులకెల్ల నెలవు - ధీరచరిత్రా!
ఆ మహిత వంశకీర్తికి
క్షేమంబును గూర్చినారుశ్రీ ఆదిత్యా!

2. ఆదిత్యుడు కరుణించిప్ర
సాదింపగ జననమొంది సౌజన్యముతో
కాదన రాకుండ కళల
నాదరముగ జూతురయ్య! ఆనందముగా

3. కమ్మగ కంఠమెత్తి కలకంఠ మనోహర నాద మాధురుల్
గ్రమ్మ తెనుంగు పద్యముల గానమొనర్చెడి మీ ప్రవృత్తిచి
త్తమ్మున నిల్ప జీవిత విధానము తీరిచిదిద్దు నెంతొ స
త్యమ్మిది భాషయన్న మమతారుచి యొప్పగ కూర్చునెన్నగన్

4. మనసు వాక్కు కర్మ మనజాలు నొకటిగా
మనసు నిత్య ధర్మ మయము గాగ
కర్మలార్జవమును కనిపింప జేయగా
వాక్కు సత్యమగుచు వరలుచుండు.

5. పరులకుపకార మొనరించు పరమ ధర్మ





మిపుడు పాటించు నరుడె లేడెందుజూడ
పరుల కపకారులకునైన పాడి గూర్చు
సత్పురుషులగు మిమ్ముమే సంస్తుతింతు.

6. మీకారణమె కదా! మేటి పద్యములెల్ల
హృద్యమై శ్రోతృ సంవేద్యమగుట
మీప్రేరణమె కదా! మేలైన శతకముల్
వాయుతరంగాల వ్యాప్తి గనుట
మీవలననె కదా! యావదాంధ్రమునకు
నాలోచనాలోచనాప్తియగుట
మీ కతనె కదా! లోకహితముగూర్చి
ఆకాశవాణి యాహ్లాదమిడుట
మీరు చేపట్టి నడిపించు కారణమున
సరస సంగీత సాహిత్య సభలకెల్ల
ప్రాపు లభియించె సరిక్రొత్త ఊపువచ్చె
సన్నుతింతు నాదిత్యప్రసాద! మిమ్ము.

7. అతులమహనీయమూర్తికి నంజలించి
పద్య సుమగుచ్ఛ మిదె సమర్పణమొనర్తు
తెలుగు వెలుగులు దిశలెల్ల తేజరిల్ల
ఆయురారోగ్య భాగ్యాల నందుకొనుడు.

-'సారస్వత కళానిధి' డా॥ వి. రాజ్యలక్ష్మి,
ఎం.ఏ, పి.హెచ్‌డి, రీడర్, ప్రభుత్వ మహిళా
కళాశాల, గుంటూరు, 93941 13848.

కవితాంశం:

# స్నేహం





## నా నిశ్శబ్దంలో నీ పిలుపు

"మనసుకు గాయమైంది..., మందు లేదు...,
మౌనం ఆవహించింది..., భారంగా మారింది...,
మాట్లాడ్డం మరిచిపోయా..., ఏదో నిశ్శబ్దం...,
ఎవరూ లేరన్న భావన..., తూటాలా...,
శరీరాన్ని తూట్లు చేసింది..., నిస్సత్తువ..., నిరాశ..., నిర్వేదం...,
కన్నీళ్లు భయపడుతున్నాయ్..., ధైర్యం నన్ను దైన్యంగా చూస్తోంది...,
అక్షరాలు రాయాలంటే మొద్దుబారిన వేళ్లు వెక్కిరిస్తున్నాయ్...,
ఎన్నో రోజులు..., లెక్కపెట్టలేనంత నీ మాటల వర్షం...,
ఇంతలో మెరుపులా నువ్వు..., తడిలేని నా హృదయంలో నీ మాటల వర్షం...,
మళ్లీ కొత్తగా చిగురించాను..., నా మౌనం రెక్కలు కట్టుకుని ఎగిరిపోయింది...,
అప్పుడు మాటలు నేర్చుకున్నా., కాలంతో పోటీపడ్డా...,

మనస్సు తూట్లు మాయమయ్యాయి..., విశ్రాంతిలో ఓలలాడుతున్నా...,
నా నిశ్శబ్దంలో నీ పిలుపు..., నీ మాటలు...,
నీ చెలిమి కొలనులో నేనో తామరనయ్యా..."!

-అమూల్య. తెర్లి
డోర్ నెం:29-27-23,
సూర్యనారాయణ వీధి,
సూర్యారావు పేట,
విజయవాడ-520 002.
ఫోన్: 73968 35305

# అక్షర కుక్షి

నీతో పరిచయం ఎప్పుడైందో జ్ఞాపకంలేదు
దస్తావేదులు ఖైఫీయతులు లేవు
ఏ కాలనాళికలోనూ బధ్రం చెయ్యలేదు
ఏ కొండకోనల్లో చిత్రించలేదు
ఏ వాగ్గేయకారుని చేతనో రాగాలు పలికించలేదు
ఉషోదయపు వేళ కోకిల రాగాలు పలికించలేదు
గోధూళి వేళ కోకిల రాగాలు వినిపించినప్పుడు
పండువెన్నెల్లో నదీ తీరంలోని ఇసుక తెన్నెల్ని
నదీ తరంగాలు తాకినప్పుడు

వేణువు నుండి ప్రణవ నాదం ధ్వనించినప్పుడు
కవి 'కలం' కదిలించినప్పుడు
భూమార్గం పట్టినప్పుడు– భూకంపం పుట్టినప్పుడు
నానా రాజ దర్శనం కలిగినప్పుడు
అక్షర కుక్షిలో అమృతభాండం పగిలినప్పుడు
అక్షరం అచ్చురూపంలో మారినప్పుడు
ప్రతీ సందర్భంలోనూ నీ పరిచయం గుర్తు చేసుకుంటా
నీ స్నేహం మాధుర్యంలో తడిసి ముద్ద అవ్వాలనుకుంటా.

**–వేలూరి కౌండిన్య**
93929 42485.





# స్నేహం

అనురాగానికి రూపం
ఆత్మీయతకు ప్రతిరూపం
వాత్సల్యానికి వరం
అనుబంధానికి ఆభరణం
బంధాలను కలిపేది స్నేహం
హితం కోరేది స్నేహం
పరిమితం కానిది స్నేహం
సృష్టిలో అతి మధురం స్నేహం
ఆటలాడేవేళ పక్కింటి
పండుగాడు నా ఫ్రెండ్
బడిలో కెళ్లేవేళ
బన్నీగాడు బెస్ట్ ఫ్రెండ్
హైస్కూల్ కెళ్లాక కళ్యాణి
అయ్యింది నా గర్ల్‌ఫ్రెండ్
ఉద్యోగ వేటలో ఉదయ్ నా రూమ్‌మేట్
అప్పుడు అన్నీ ఒన్ బై టూలే
జాబ్ వచ్చాక జానీతో పరిచయం
జీవితంలో మరువలేని జ్ఞాపకం
బదిలీపై వచ్చాను విశాఖపట్నం
సన్యాసిరావుని కలిపింది సాగరతీరం
అక్కడే గడిచింది సగజీవితం
రిటైర్‌మెంట్ రోజు వచ్చింది

రాలేదు నా బంధుగణం
హాజరయ్యారు మిత్రబృందం
స్నేహ సుగంధాల జడివానలో..
తడిసింది నా హృదయం
స్నేహానికి ఇదే కొలమానం
స్నేహమేరా జీవితం...
స్నేహమేరా శాశ్వతం...

**-పాణిగ్రాహి రాజశేఖర్**
ఇంటి నెం:1-1-15, రావిచెట్టు సెంటర్,
విద్యాధరపురం, విజయవాడ-12.
సెల్: 92920 06075
9290269918.





# దిరిసెన పువ్వు

కొన్ని రాత్రిళ్ళు చీకటిని
మీద బోర్లించుకున్నాను
పగుళ్ళూ, వాటి తాలూకా పగుళ్ళూ
నా మనో పాదాలకూ సోక కూడదనీ
ఆమెను ఆవాహన చేసుకుని
నేనదృశ్యమయ్యాను
చీకటి వాకిట్లో
కాస్తంత చల్లి
ఆశగా నుంచున్నాను
ఆమె అటుగా వెళ్ళేటపుడు పడే
పాదముద్రల కోసం
గాలినై దేవులాడతాను
ఇంకా మేల్కొనలేదేమోనని
కిటికీ పక్కన
నిలబడిన... నిశ్శబ్దాన్నై
నా ఊపిరి అలికిడి
అలజడి అవుతుందని
తనూ వృక్షానికి పూసిన
ప్రాణపు దిరిసెన పూవ్వును
తెల్లవారుఝామున రాల్చుకున్నాను
ఇపుడామె లేదు
నేనూ లేను.

**- కోసూరి రవికుమార్**
దాచేపల్లి, గుంటూరు జిల్లా

# స్నేహం

ఆ ఇద్దరి మధ్య స్నేహం
ఆశ్చర్యకరం
ఆ ఇద్దరి మధ్య స్నేహం
ఆందోళనకరం
ఆ ఇద్దరి మధ్య స్నేహం
అభేద్యం!
అయితే ఆ ఇద్దరి మధ్య స్నేహం
అభివృద్ధి నిరోధం
ఆ ఇద్దరూ
రాజకీయం... అవినీతి

ఆరు రుచుల మధ్య
స్నేహం ఆరోగ్యకరం
ఆరు పార్టీల మధ్య స్నేహం
మరింత ఆరోగ్యకరం!

అమ్మానాన్నలతో స్నేహం
జీవితానికి వెలుగు
గురువులతో స్నేహం
మేధకు మెరుగు





మంచి స్నేహానికి
కులమత మరకలు
వద్దనేది ఎందుకో!
మట్టి ప్రమిదలో
మడ్డి నూనె పోసినా
వత్తి వెలుగు తగ్గనందుకా...

– **'వసుధ'**
గుడివాడ
ఫోన్: 94908 32787.

# స్నేహవనం

ప్రేమ, అనురాగం, అభిమానం
కొమ్మలుగా
సౌశీల్యం, సౌకుమార్యం, సౌభాగ్యం
పుష్పాలుగా
సేవాగుణం, సహజీవనం, సర్వజనహితం
ఫలాలుగా
మనసు మట్టితొట్టిలో
మొలకెత్తే విత్తనం స్నేహం
స్నేహలతకు
ఓర్పు, నేర్పుల జలమందిస్తే
నమ్మకమనే సూర్యరశ్మితో విస్తరించి
ఆకుపచ్చని వెన్నెలవుతుంది
సమభావాల వృక్షమవుతుంది
స్నేహమంటే...
మల్లీ, మామిడీ కలబోత
స్నేహమంటే...
మమత, మానవత కలనేత
స్నేహమంత్రం జపించిన హృదయం
వేయి సూర్యుల ప్రకాశం
పవిత్ర దేవాలయం
స్నేహామృతం తాగిన మనసు





మహోదయానికి తొలి ఉషస్సు
సప్తవర్ణాల ఇంద్రధనస్సు
స్నేహ వృక్షాన్ని సంరక్షిస్తే
జీవితం సుఫలం
జీవన వనానికి ప్రాణం స్నేహం...!

**-కోపూరి పుష్పాదేవి**
విజయవాడ-1
ఫోన్: 94407 66375.

# స్నేహపరిమళం

వసంతుడే స్నేహితుడని వనమంతా పలికింది
స్నేహ సుగంధాలకు సాటి మరేదీలేదని చాటింది
గుప్పుమన్న స్నేహ పరమళం చప్పున గుభాళించింది
స్నేహితుడే దూరమైతే శిశిరపు శత్రువు కసిరివేస్తాడని నిలిచి చెప్పింది
నేటి సమాజంలోని కల్తీనేస్తాలను పరికించి పగలబడి నవ్వింది.

చిరకాల నెచ్చెలి ఆ కోయిలకు
లేత చిగురులతో మావికొమ్మ ఆహ్వానం పలికింది
'మిత్రమా' అంటూ దాచిన చిగురు పంచి ఇచ్చింది
'దోస్తి' అంటే దోచుకోవడం కాదని ప్రాణం తీసేందుకు కాచుకోవడం
కాదని పలికి చెప్పింది
సమాజంలోని నటన స్నేహాలను గాంచి నవ్విపోయింది

పుల్లనైన మావిపిందె చైత్రముతో స్నేహం కోరింది
మాసమంతా స్నేహించి మధురమైన పండుగా మారిపోయింది
స్నేహమంటే మాధుర్యమని మనిషి మనిషికి చెప్పింది
సమాజంలోని కపట స్నేహాలు విని విస్తుపోయింది.

పచ్చని మావికొమ్మ నల్లని కోయిలమ్మను స్వాగతించింది
స్నేహబంధంలో తరతమ బేధాలుండవని శాసనం చేసింది





సమాజంలోని బిజినెస్ స్నేహాలను చూసి బిత్తరపోయింది.

బాటసారి స్నేహతుడితో ఆ వేపచెట్టు బాంధవ్యం కలిపింది
నీడవంటి ఆతిథ్యం అతని ముంగిట పోసింది
స్నేహమంటే దాతృత్వమనే మర్మాన్ని తెలిపింది
సమాజంలోని నమ్మక ద్రోహులను గాంచా వెక్కిరించిపోయింది
ఉగాది పర్వదినం చెలిమి స్నేహాల తోరణం
అందమైన స్నేహానికి చక్కనైన సంకేతం!

**-జి.మేరీ కృపాభాయి**
మచిలీపట్నం
ఫోన్: 99893 47374.

# నీ స్నేహం

ప్రియ నేస్తం.. నువ్వే నాకు సమస్తం..
కనుపాపవు నీవైతే
కంటిరెప్పనై కాపాడతా..
కవివి నీవైతే
నువు రాసే కవితనవుతా..
నావవు నీవైతే
చుక్కానినై నడిపిస్తా..
పుష్పానివి నీవైతే
దండ కట్టే దారాన్నవుతా..
చేపవి నీవైతే
నీటిని నేనవుతా..
చెక్కువి నీవైతే
చేవ్రాలును నేనవుతా..
అంబరానివి నీవైతే
హరివిల్లును నేనవుతా..
అంతెందుకు..
నా ఒంట్లో రక్తం ఎర్రగా ఉన్నంతవరకు
నీ స్నేహితుడిగా ఉంటా..

–శర్మ సీ.హెచ్
89–19–8/1, సుబ్రహ్మణ్య టవర్స్,
డోర్నకల్ రోడ్, సూర్యారావు పేట,
విజయవాడ–520 002, ఫోన్: 95055 07528.





# స్నేహం

ఎదురెదురుగా అంటే ఉత్తరానొకటి దక్షిణానొక్కటి రెండుకొండలు. దక్షిణ గాలి ఉత్తరాన్ని తాకుతుంది. దక్షిణపు మిట్ట మీద గాలి ఉత్తరపు మిట్టను తాకుతుంది. దక్షిణపు మిట్ట మీద 'స్నే' అనే అక్షరం ఉత్తరం మిట్ట మీద 'హం' అనే అక్షరం ఉంటున్నాయి. 'హం' నిండా అహంకారమే! పైగా చాలా బరువైన దిట్ట. 'స్నే' అన్నదో తేలికైన అక్షరం ఓనకారం ఆశ్రయించినా.
ఓ రోజో పెద్ద దక్షిణ మారుతం. ఎన్నో చెట్లు, చామలు కూకటి వ్రేళ్లతో సహా లేచిపడ్డాయి. ఆ గాలికి 'స్నే' ఎగిరి గాలివాటాన కొట్టుకుపోతుంటే ఉత్తరాద్రిమీది 'హం' హోంకరించి దాన్ని పట్టుకుంది. నీవెవరంది. నన్ను 'స్నే' అంటారని చెప్పుకొంది. నాతో జతకట్టు నిన్నే గాలి కదల్చ లేదంది. 'స్నే' సరేనంది. నా ముందుగ నిన్ను పెడతా అప్పుడు మనిద్దరం 'స్నేహం'జేతాము. మనం స్నేహితులమన్న మాట ఎవరూ మనల్ని విడగొట్టలేరు. అలా స్నేహం అనే మాట పుట్టింది.

శ్రీరామచంద్రుడూ, సుగ్రీవుడూ అగ్నిసాక్షిగా ఈ స్నేహాన్నాశ్రయించి దానికి పురాణ కీర్తిని కల్పించారు. దుర్యోధనుడూ, కర్ణుడూ భారతంలో చోటునిచ్చారు. అలా అలా పెరిగిన స్నేహపు స్నేహం భార్యాభర్తల్ని ఆశ్రయించి సమాజానికెంతో పుష్టినీ, పరిపుష్టినీ కల్పించింది.

ప్రకృతి పులకించి మామిడిచెట్లును చిగురింపజేస్తే, కోకిలలు వాటితో స్నేహంజేసి ఆరగాచి కూ కూమన్న కూజితాలతో దిక్కులన్నింటా సరాగాలను చిందించిందించాయి. మామిడి పూసింది. కాయ కాసింది. పండ్లనిచ్చింది. మరో మామిడికో జన్మనిచ్చింది. ఇదంతా స్నేహ మహత్యమే!

ఈ రెండక్షరాల స్నేహం యుగయుగాలనుండి సుసిద్ధంగా ఉంది. దీన్నాదర్శంగా తీసికొని జనాలుంటే కాపురాలు అవిచ్ఛిన్నంగా ఉంటాయి.

సమాజం శాంతి సౌజన్యాలతో విరాజిల్లుతుంది. దేశం సుభిక్షంగా ఉండి సత్యహరిశ్చంద్రుల్ని సృష్టిస్తుంది.

10 పంక్తుల్లో వ్రాయండంటే ఇంతసోది వ్రాయొచ్చా అంది స్నేహం.

మరిపుట్టుక నుంచి పురాణాల్దాకా వ్రాస్తే పొడుగ్గాక పొట్టిగా ఎలా ఉంటుందట? అంది 'హం'.

–గంధం వేంకాస్వామిశర్మ





# అజరామరము స్నేహం

స్నేహం వేయి రేకుల పద్మం
అన్ని వేళలా అన్ని వైపుల నించి
కంటికి రెప్పలా కాపాడేది
వ్రేళ్ళు పైకి కనిపించకుండా
వృక్షమును ధీశాలిగా నిలిపినట్లు
పద్మము సరోవరం ఒండొంటి కలయిక
నిండుగా సుందరమ్ముగా సంపర్కము
నూతన వికాసము నొసగి నట్లుగ
అఖండ జ్ఞాన సంపత్తి కలుగ చేయు
జ్ఞానాధిపతి ఉపాధ్యాయుని వలె
విమర్శల దీపకాంతిని ప్రసరింప చేయువాడు
నాగస్వరమునకు నాగుపాము నర్తించునట్లు
ప్రీతికరముగ ముదమునొసగువాడు
చంద్రోదయమున వుప్పొంగు తరంగాలు
అనంత ఘోషతో అంబరాన్ని చుంబించినట్లు
సూర్యరశ్మికి కరగు మంచువలె
నవనీత హృదయుడై అలరారునట్లు
నిశ్శబ్దంగా వికసించు పుష్పము
సుగంధం పరులకోసమే యన్నట్లు
మకరందము భ్రమరం కోసమే దాచినట్లు

ప్రశాంతముగా చంద్రుడు అభివృద్ధిచెంది
భానుమండలము ప్రకాశింప జేయునట్లు
ప్రాణానికి ప్రాణమును అడ్డువేసి
స్నేహము అనంత సాగరమని
అపార సంపదంతా స్నేహం కోసం తృణపాయంగా
కవచకుండలాలను తృజించులకు వెరవనిది
శతసహస్ర గుణముల భాసిల్లునది
అజరామర స్నేహమొక్కటే ఈ అవనిలో.

**–తేజస్విని**
కేరాఫ్ ఎ.మోహన్ మురళీకుమార్
విజయవాడ
ఫోన్: 98496 35488.





# స్నేహవారధి నిర్మిద్దాం

అసలే ఇరుకు భావాలు
ప్రపంచీకరణ జరుగుతున్నా
ఎడమైపోతున్నాడు కాని కలవలేకపోతున్నాం
వాణిజ్య వారధి నిర్మించుకున్నాం కాని
స్నేహవారధిని కట్టుకోలేకపోతున్నాం
స్నేహం అంటే నెయ్యి అనీ అర్థంవుందిగా!
అజ్యంపోస్తే జ్వాల బాగా రగుల్తుంది
అని దహించేది కారాదు
అనుబంధం పెంచేదిగా వుంటేనే
బతుకులు పండుతాయి – వెతలు తీరుతాయి
ఏకభావ ప్రపంచానికి అందరం
ఉడతాభక్తి సాయం చేయాల్సిందే
అభిప్రాయ భేదం సహజాతమే
ఐనా అధిగమించి ముందడుగేయాలి
స్నేహం బలమైతే పెనుచీకటి పారిపోయింది
వెలుగుల వర్షమే కురుస్తుంది
అవని అంతా నందన వనమై
మాధుర్యపు మకరందాలు తృప్తినిస్తాయి
అనుక్షణం వర్ధిల్లాల్సిందే స్నేహం
ఏడాదికోనాడు స్నేహదినం పెట్టరాదు
స్నేహం దినదిన ప్రవర్ధమానమై
హృదయాలను వికసింపజేయాలి

రెండక్షరాల ప్రేమకంటే
ఈ రెండక్షరాల స్నేహం గొప్పదే
ఆత్మీయత పెంచి, ఆరోగ్యకర వాతావరణం పుష్పిస్తుంది
విధ్వంసాన్ని ఆపి, వివేకాన్ని పెంచుతుంది
స్నేహం అనేది వ్యామోహం కాదు
అదొక త్యాగానికి ప్రతీక.

**-గబ్బిట దుర్గాప్రసాద్**
2-405, శివాలయం వీధి,
ఉయ్యూరు-521 165.





# స్నేహం

సృష్టిలో తేతానది స్నేహం
మనలో ఉండాలి సహృదయం
స్నేహంలో ఉండే మాధుర్యం
కాపాడుకోవడమే జీవితం
సంసారం ఒక సుడిగుండం
ఇందులో కష్టనష్టాలనేకం
తల్లిదండ్రులతో చెప్పుకోవడం
మానసికంగా బాధపడడం
సులభం చేస్తూ హృదయం విప్పి
చెప్పుకోవడం స్నేహితులకి
తెగని సమస్యలకు పరిష్కారం
చెప్పగల స్నేహితుల సంస్కారం
దారి తప్పిన దారికి
దారిచూపిందీ గుడి
గతులు తప్పించే స్నేహం
వద్దురా జగతిలో మనకి

**-వద్దాది లక్ష్మీసుభద్ర**
ఫ్లాట్ నెం:10, సి.టి.ఓ.కాలనీ,
విజయవాడ-520 008.
ఫోన్: 0866-2541543.

# చెరో సగం

పలకరించు కోవడం
గతాన్ని నీడలా వేలాడదీయడం
ఒక్కోసారి నిశ్శబ్దంగా మిగిలిపోవడం
ఎంత బావుంటుంది!

నీదగ్గర గడిపిన...
నీతో మాట్లాడిన క్షణాలన్నీ
కరిగిపోయాయి కదా!
ఎలా మిగిలాం!
చెరో దిక్కు ఆకాశాన్ని చీలుస్తూ
నీముఖం నాకు
నాముఖం నీకు కనబడక
ఎన్నాళ్ళయింది?

మనిద్దరి కలయిక మధ్య
కాలం భారంగా విషాదంగా నడిచింది
గడిచిన కాలం గుర్తులలో
చెరిగిపోని ఆత్మీయ ఆలింగనాలేవి?

మరిచిపోయావా!
ఉడకని అన్నంలో
మనిద్దరి చేతులు కాలిన కాలాన్ని
గాయం జ్ఞాపకం చేస్తుంది





నీ చిర్నవ్వు వెనుక దాగిన అంతరంగాన్ని–
నడిచిపోయిన కాలం రెక్కలపై
విరిసిన రోజాపూల ఎర్రదనాన్ని
శరీరంపై వాలిన రాబందుల రెక్కల చప్పుడను
ఎన్నాళ్ళయిందో చూచి!

మా ఊరిని.. ఆ ఊరిలో నిన్ను
హృదయంలో బొమ్మలా చిత్రించబడ్డావు కదా!
అందరూ కనబడుతున్నారు
వారందరిలో నీ ముఖాన్ని చూస్తున్నా–

నిరీక్షణ
జీవన కాలమంతా పరుచుకొని ఉంది
నిన్ను కలిసే క్షణాలలో
తడి నయనాల కబుర్లలో
మళ్ళీ కలవగలిగే క్షణాల కోసం ఎదురుచూస్తాం!

**– అరసవిల్లి కృష్ణ**
పోస్‌బాక్స్ నెం.13,
విజయవాడ– 520 001
సెల్ నెం.9247253884